# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. Regd. No. M. 1118 Vol. 36 No. 29 SATURDAY 30 th APRIL 1949 వెల ఒకఅణా Founder: K. Nageswara Ra

# ఐర్ శాసనసభలో నెహ్రూకు అపూర్వస్వాగతం

## ఇండియా ఐర్లెండుల సన్నిహిత సహకారావశ్యకత: ఐరిష్ ప్రజలకు సందేశం

డబ్లిన్, ఏప్రిల్ 28: భారతప్రధాని నెహ్రూకు 'ఐర్' శాసన సభ నేడు ఏ అతిథికీ ఇప్పటివరకు చేయని అపూర్వమైన సత్కారం చేసినది. ఐర్ ప్రధాని కాస్టెల్లో, ప్రతిపక్షనాయకుడు సభాభవన మధ్యంలో భారతప్రధానికి ఎదురువెళ్లి స్వాగతమిచ్చి, మంత్రివర్గ సభ్యులు ఆసీనులయ్యే సభాభాగానికి తోడ్కొనివెళ్లి అక్కడ ఉచితాసనంపై కూర్చుండబెట్టారు. నెహ్రూ డబ్లిన్‌ను విద్యార్థిగావుండే రోజులలో రావడమేగాని, ఆ తర్వాత మళ్లీ ఎన్నడూ రాలేదు.

ప్రధానినెహ్రూ అఖండస్వాగతాన్ని స్వీకరించినపిమ్మట, సభాకార్యక్రమాన్ని అరగంటసేపు వీక్షించారు.

"ఐర్లెండు—భారతదేశాల మైత్రి ఉభయదేశాల యోగక్షేమాలకూ, ప్రపంచశాంతి స్వాతంత్ర్యముల పోషణకు సాధనం కాగలదని విశ్వసిస్తున్నాను," అని నెహ్రూ రాయిటర్ విలేఖరితో ముచ్చటిస్తూ 'ఐర్' ప్రజలకు ప్రత్యేకసందేశాన్ని అందజేశారు.

భారతప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ నేడు దయం లండన్ [illegible] డి ఇక్కడికి వచ్చి [illegible] శ్రయంవద్ద ఐరిష్ ప్రధాని [illegible] భారతీయులు పండిట్ [illegible] గొప్పస్వాగతం చెప్పారు. పండిట్ నెహ్రూజీ తిరిగి లండన్ వెళ్తున్నారు.

డబ్లిన్‌యుని భారతసమితి రాయబార వర్గము ఐర్లెండ్‌లోని భారతీయ, దక్షిణాఫ్రికా విద్యార్థులసభలో భారత ప్రధాన మంత్రి ఈవిధంగా ఉపన్యసించారు:

"భారతదేశం మచికి బ్రహ్మాండమైన మార్పులు జరుగుతూవున్నవి. అక్కడ పరిస్థితులు అతివేగంగా మారిపోయినవి. భారతదేశ విభజనకు సంబంధించి అతి దురదృష్టకరమైన పరిస్థితి ఉన్నమాట యదార్థమే—ఈసందర్భంలో కావాలనే దురదృష్టవంతమైన అని అంటున్నాను.

"పరిష్కారం చేయవలసిన సమస్యలు కొల్లలుగానున్నవి. అయితే గడచిన 20 మాసాల్లోనూ చెప్పుకోతగిన ఫలితాలనే సాధించాం. పాకిస్తాన్‌నుండి వచ్చి చేసిన కాందిశీకులసమస్య బ్రహ్మాండమైనది బహుశః ఆసమస్య పరిష్కారానికి చాలా కాలం పట్టవచ్చును."

ఇండియా, ఐర్లెండ్‌లమధ్య చిరకాలంగా ఉంటున్న గాఢమైత్రిని కొనియాడుతూ భారతప్రధాని తమ ప్రసంగాన్ని ముగించారు. పండిట్ నెహ్రూ విమానాశ్రయం నుండి ఐరిష్‌ప్రధాని కాస్టెల్లో జంట్ [illegible] హోటల్‌కు వచ్చారు. అక్కడ వారిదర్శనార్థం చాలామంది చేరియుండిరి. అక్కడక్కడనుండి భారతీయవిద్యార్థులను, ఇండియాలీగ్‌ప్రతినిధులను ఉద్దేశించి పండిట్ నెహ్రూ సైనికంగా ఉపన్యసించినారు.

పండిట్‌నెహ్రూవెంట లండన్‌నుండి వి. కె. కృష్ణమీనన్ లండన్‌లోని ఐరిష్ హైకమీషనరు జాన్ డుల్లాంటీ కూడా వచ్చారు.

విమానాశ్రయంవద్ద ఐరిష్ ప్రధానితో బాటు ఐరిష్‌పార్లమెంటు ప్రతికూల పక్ష నాయకుడు డి వలరా కూడ పండిట్ నెహ్రూకు స్వాగతం చెప్పారు.

ఐరిష్ రిపబ్లిక్ అధ్యక్షుడు సీన్ టి. ఓకెల్లీని వారిఅధికార భవనంలో పండిట్ నెహ్రూ కలుసుకున్నారు.

లండన్‌లో పరిసమాప్తమైన కామన్వెల్తు ప్రధానుల సమావేశ నిర్ణయాలనుబట్టి భారతప్రధానమంత్రి పండిట్ నెహ్రూ డబ్లిన్ ఆగమనానికి ప్రత్యేకప్రాధాన్యత ఉన్నదని పరిశీలకులు భావిస్తున్నారు. భారత సమస్యాపరిష్కారం ఐరిష్ అధికారవర్గాలకు ప్రత్యేక ఉత్సాహకరమైనది. అట్టి ప్రాతిపదికపై ఐరిష్ సమస్యా పరిష్కారానికి మార్గాన్వేషణ చేయకూడదా అని ఐరిష్ పార్లమెంటుసభ్యులు ప్రశ్నిస్తున్నారు.

భారతప్రధాని తిరిగి వెళ్లేటప్పుడు ఈ నూత్నపరిష్కారంపై ఐరిష్ ప్రభుత్వాభిప్రాయానికి సంబంధించిన ఒకముఖ్య సందేశాన్ని తీసుకొని వెళ్లవచ్చునని కూడా ఊహింపబడుతున్నది.

భారతదేశం విషయంలో తానేమీ ప్రస్తుతం చెప్పలేనని ఆవిశేషంలో భారతీయులకు సంబంధించిందేనని ఐరిష్ ప్రధాని జాన్ కాస్టెల్లో అన్నారు. అయితే ఐర్లెండ్ విభజనను అంతంచేయడానికి తిరిగి ఒక క్రొత్తప్రయత్నం జరగవచ్చునని లోపలివర్గాల అభిప్రాయమైనట్లు తెల్పుతున్నది. దాదాపు 27 సంవత్సరాలక్రితం ఐక్య ఐర్లెండ్ సమస్యా పరిష్కారానికి డివలరా దాదాపు ఇలాంటి పథకాన్నే సూచించారు. ఆ విధమైన ఐరిష్ రిపబ్లిక్

(4వ పేజి చూడుము)

## దక్షిణాఫ్రికా భారతీయ సమస్య

### సమితి సారధ్య సంఘ ప్రస్తావన: వాయిదా

ఫ్లషింగ్ మెడోస్, ఏప్రిల్ 28: ఇండియా, దక్షిణాఫ్రికాల తగాదాను, ఫ్రాన్స్ యూనియన్‌ల తగాదాను, మరికొన్ని ఇతర అంశాలను సమితి యొక్క అదనపు రాజకీయ సంఘానికి ప్రతిపాదించటమా లేదా అన్న అంశాన్ని సమితి పాలన సంఘం నేడు కొంతసేపు చర్చించి నిర్ణయాన్ని రేపటికి వాయిదా వేసినది. అసలు రాజకీయ సంఘం ప్రస్తుతం ఇటలీ వలసల భవిష్యత్తు, దక్షిణాఫ్రికాలో భారతీయుల విషయమై ఇండియా, దక్షిణాఫ్రికా చేసినఫిర్యాదు, ఫ్రాన్స్ యూనియన్‌ల తగాదా ఇండోనీసియా సమస్య, సమితి సభ్యత్వానికి ఇజ్రేల్ పెట్టిన దరఖాస్తు అన్న 5 ప్రధానాంశాలను చర్చించవలసియున్నది త్వరగా చర్చ ముగిసి అంశాలు తేలడానికి వీలుగా వీటిలో కొన్ని అంశాలను అదనపు రాజకీయ సంఘానికి అప్పగించవలెనని ప్రయత్నం జరుగుతున్నది.

ఇండోనీసియా సమస్యను అదనపు సంఘానికి ఉదహరించాలని బ్రిటన్ ప్రతిపాదించినది. ఇండోనీసియాను అసలు సంఘమే చర్చించి ఇండియా దక్షిణాఫ్రికా తగాదాను, ఇజ్రేల్ దరఖాస్తును అదనపు సంఘం చర్చించవచ్చునని పోలెండ్ ప్రతిపాదించినది.



## అక్షరాలా నిజమైన గాంధి జాతకం!

అహమ్మదాబాదు, ఏప్రిల్ 28: కీర్తిశేషుడైన ఒక బ్రాహ్మణుడు, మహాత్మాగాంధీ జాతకాన్ని సంస్కృతభాషలో వ్రాసివుంచాడు. ఆయన కుటుంబంవారు ఆజాతకాన్ని, గాంధీ జాతీయ స్మారక ధర్మకర్తృత్వ సంఘం వారికి అందజేశారు. గాంధిజీ స్మారకచిహ్నాలలో ఒకటిగా ఈ జాతకాన్ని కూడా సేకరించుతున్నారు. ఆజాతకంలో గాంధీజీకి 78, 79, 80 సంవత్సరాలలో ఆయుర్గండం వుందనీ, అది గడిస్తే 125 సంవత్సరాల ఆయుర్దాయం వుందనీ వ్రాయబడి వుంది.

## డచ్చి ఇండోనీసియా వర్గాల దృక్పథాలు: పరస్పరావగాహన

### బటేవియా సంప్రతింపుల ధోరణి

బటేవియా, ఏప్రిల్ 28: ఇండోనీషియా రిపబ్లిక్ ప్రతినిధులకూ, డచ్ ప్రభుత్వానికీ మధ్య జరుగుతున్న సంప్రదింపులవల్ల పరస్పరం ఒకరి దృక్పథాన్ని ఒకరు అర్థంచేసుకోటానికి అవకాశం ఏర్పడ్డదని ఒక రిపబ్లికన్ అధికారి చెబుతున్నాడు.

డచ్ ప్రతినిధి వాన్ రోయిన్‌తో మాటాడేందుకు రిపబ్లికన్ ప్రధాని మహమ్మద్ హట్టా కడచిన ఆదివారం బటేవియాకు వచ్చాడు. ఈయన తిరిగి రేపటిదినం బటేవియాకు వెళ్లిపోతాడు.

ఈ సంప్రదింపులవల్ల ప్రధాన సూత్రాలలో ఏ విధమైన సమన్వయమూ యేర్పడలేదని తెలుస్తున్నది.

ప్రతినిధుల సమావేశం క్రిందటివారం జరిగింది. మళ్లా ఎప్పుడు సమావేశమయ్యేదీ ఇంకా ఏదీ నిర్ణయం కాలేదు.

ఒక డచ్ వారపత్రిక ప్రకటించిన వార్తను క్రోడీకరించుతూ రాయిటర్ వార్తాసంస్థ ఇలా తెలుపుతున్నది.

తూర్పుజావాలో కమ్యూనిస్టులూ ఇతర వర్గాలూ కొట్టుకుంటున్నారు. తూర్పు జావాలోని మలంగ్ ప్రాంతంలో శాంతి భద్రతలు పూర్తిగా నశించి, వ్యవస్థితమైన పరిపాలనా ఉండటానికి వీలు తప్పింది.

"సోలో కర్టా చుట్టూనూ మధ్యజావాలోని సోలోకొర్టా చుట్టూరా కమ్యూనిస్టుల కల్లోలం ఇంకా చాలా ఉధృతంగా సాగుతుంది.

సబాంగ్ రంగంలో 50 మంది ఇండోనీసియనులు చచ్చిపోయారు. మధ్య జావాలో చెరిబాన్‌కు పైబుదిగా జరుగుతున్న యుద్ధంలో మరో 50 మంది చని పోయారు" అని ఆ పత్రిక ప్రకటించింది.

తక్కర్‌బాపా విద్యాలయం గాంధీ ప్రార్థన మంటపం శంకుస్థాపనము డా॥ రాజేంద్రప్రసాద్‌గారు యీ వారం జరిపిరి. చిత్రపటములో డా॥ రాజేంద్రప్రసాద్‌గారు మదరాసు ప్రధాని శ్రీ పి. యస్. కుమారస్వామిరాజా, హరిజనసంక్షేమమంత్రి శ్రీ వి. పరమేశ్వరన్ గార్లు కలరు.

## బర్మా సరిహద్దులకు 100 మైళ్లలో చైనీస్ కమ్యూనిస్టులు

రంగూన్, ఏప్రిల్ 28: బర్మా-చైనా సరిహద్దుల్లో బర్మా సరిహద్దుకు 100 మైళ్ల దూరంలో ఉన్న పావ్‌షాన్ పట్టణాన్ని 2 వేలమంది చైనీస్ కమ్యూనిస్టులు ఆక్రమించుకున్నారని బర్మా ప్రభుత్వ సైనిక రేడియో నేటిరాత్రి ప్రకటించినది. ఇందువల్ల బర్మా, చైనాలను కలిపే ప్రధాన రహదారి బర్మా-చైనారోడ్డు ఛేదించబడ్డది. దీనితో బర్మాసరిహద్దులకు ఆనుకొనిఉన్న ప్రధాన చైనీస్‌కస్టమ్స్ స్థావరం వాంటింగ్ ఏకాకి అయిపోయినదని ఆ ప్రకటన తెలియజేస్తున్నది.

## ఎలిజబెత్ రాకుమారికి సంగీతంలో పట్టం

బాంగార్ (ఉత్తర వేల్సు), ఏప్రిల్ 28: జార్జిరాజుగారి కుమార్తెయైన ఎలిజబెతు రాకుమారికి వేల్సులోనున్న బాంగారు యూనివర్సిటీ కాలేజీ నేడు "సంగీతకోవిద" యను బిరుదు నిచ్చెను. ఎలిజబెతు రాకుమారి భర్తయైన ఎడింబరో డ్యూకు యిదివరలో బాంగారు యూనివర్సిటీ కాలేజీకి అధ్యక్షుడుగా (ఛాన్సెలరుగా) నియమింపబడెను. అందువల్ల ఆవిశ్వవిద్యాలయ ఛాన్సెలరు హోదాలో అతడు తన భార్యయైన ఎలిజబెతు రాకుమారికి "సంగీతకోవిద" యను పట్టబిరుదమును తన చేతిమీదుగా ఆ పట్ట ప్రదానసభలో ఆమెను గూర్చి ఉపన్యసించి ప్రశంసించిన పిమ్మట ఇచ్చెను. ఎడింబరో ప్రభువుఅప్పుడు వెల్సుభాషలో ప్రసంగించెను. ఎలిజబెతు రాకుమారి రక్తవర్ణంగల గౌనుధరించి మందహాసవదనయై తన గౌరవబిరుద పట్టమును తన భర్తవద్ద నుండి స్వీకరించెను. ఈ పట్టభద్రురాలితో ఛాన్సెలరైన ఎడింబరో ప్రభువు కరచాలనము గావించెను.

అటుపిమ్మట మరొక 9 మందికి పట్ట బిరుదములను ఛాన్సెలరు ఇచ్చెను.

బ్రిటిష్ ప్రధానమంత్రియైన అట్లీగారికి కూడా గౌరవ బిరుదమొకటి నేటి పట్ట ప్రదానసభలో యివ్వబడెను. ఉత్తర వేల్సుకు ఎలిజబెతు రాకుమారి తన భర్త సమేతంగా యిదే మొదటి పర్యాయముగా విచ్చేసెను.

భీమునిపట్నంలో బస్సు ఓనరు అప్పారావుగారిని కార్మికులకు వచ్చిన తగవును ఇండస్ట్రియల్ ట్రిబ్యూనల్‌కు ప్రభుత్వమువారు పరిష్కారమునకు పంపిరి.

## చెన్నపురికి రాజెన్ బాబు ఆగమనం

మద్రాసు, ఏప్రిల్ 29: రాజ్యాంగ పరిషదధ్యక్షులును, గాంధి జాతీయ స్మారకనిధి యధ్యక్షులును అగు డా॥ రాజేంద్రప్రసాద్‌గారు నేటి ఉదయము ఢిల్లీనుండి యిచ్చటికి విచ్చేసిరి. కాంగ్రెస్ మహాసభాధ్యక్షులగు డా॥ పట్టాభి సీతారామయ్యగారు, న్యాయశాఖ మంత్రి శ్రీ కే. మాధవమెనన్, తమిళనాడు కాంగ్రెస్ సంఘాధ్యక్షులగు శ్రీ కె. కామరాజ నాడార్ మున్నగు పురప్రముఖులనేకులు సెంట్రల్ స్టేషనులో వారికి స్వాగతమొసంగిరి.

గాంధి స్మారకనిధికి ద్రవ్యము వసూలు చేయు సందర్భమున దక్షిణ భారతములో పర్యటించుచు రాజేంద్రబాబు గారు యిచ్చటికివచ్చిరి.

## కామన్వెల్తు నిర్ణయం

### డా॥ రాజేంద్రబాబు సంతృప్తి

మద్రాసు, ఏప్రిల్ 29: "మన సర్వ స్వతంత్ర ప్రతిపత్తికి భంగము లేనంతవరకు మనము యిష్టమువచ్చినట్లు చేయు స్వాతంత్ర్యమునకు భంగము కలుగనంత వరకు మనము గ్రేట్ బ్రిటనుతో అత్యంత సఖ్యభావమున నుండ గోరెదము. ఇట్టి సఖ్యభావముకలగజేయు ఏ యేర్పాటైనను నాకు పరమ సమ్మతముగా నుండును" అని రాజ్యాంగ పరిషదధ్యక్షుడగు డా॥ రాజేంద్రప్రసాద్ గారు కామన్వెల్తులో భారతదేశ నూతన సంబంధము విషయమై తన యభిప్రాయము వెల్లడించుచు మా ప్రతినిధితో చెప్పెను. నూతన సూత్రము తనకు వ్యక్తిపరంగా సంతృప్తి కలిగించెనని డా॥ రాజేంద్రప్రసాద్ గారు చెప్పుచు మన సర్వ స్వతంత్ర ప్రతిపత్తికి యేవిధముగానైనను ఒరే భంగము కలిగించు సూత్రము మన ప్రధాని అంగీకరింపడని తాను దృఢముగా నమ్ముచుండెననిరి.

## విజయవాడలో మరల రేషనింగు

మచిలీపట్నం, ఏప్రిల్ 29: విజయవాడలో మరల రేషనింగు ప్రవేశపెడతారని విశ్వసనీయముగ తెలిసినది. కృష్ణాజిల్లా ఎగువ తాలూకాలలో ఇన్‌ఫార్మల్ రేషనింగు ప్రవేశపెడతారట. ఎప్పుడు ప్రవేశపెట్టేదీ మాత్రం తెలియలేదు. (స్వ. వి.)

## అమెరికన్ నీగ్రోలకు పౌరహక్కులు

### ట్రూమన్ కార్యక్రమ నిర్వహణకు బిల్లు ప్రతిపాదన

వాషింగ్టన్, ఏప్రిల్ 28: అమెరికన్ నీగ్రోలకు సర్వవిధములైన పౌర హక్కులను అన్నింటినీ ఇవ్వవలెనని ప్రెసిడెంట్ ట్రూమన్ తలపెట్టిన కార్యక్రమాన్ని నిర్వహించటానికి గాను నేడు ప్రతినిధి సభలో డెమోక్రాట్ సభ్యుడు హావర్డ్ మెక్‌గ్రాత్ నేడు కొన్ని బిల్లులను ప్రతిపాదించెను. నీగ్రోలపై ఉన్న తలపన్ను [illegible]చటం వారిని పట్టుకొని సజీవదహనం చేసేదురాగ్తాన్ని నిర్మూలించటం, తగిన ఉద్యోగాలు ఇచ్చిన క్రమంగా చూడబడేట్లు చేయటం మొదలైన అంశాలపై ఈ బిల్లులు ప్రతిపాదించబడినవి.

కాంగ్రెస్ ప్రస్తుత సమావేశంలో వాటిపై చర్చ తీసుకుంటుందా అని ప్రశ్నించగా మెక్‌గ్రాత్ ఏమీ చెప్పలేదు.

## ఫిలిప్పైన్స్ మాజీ అధ్యక్షుడు క్వెజాన్ సతీసుతలహత్య: కమ్యూనిస్టులరాక్షస చర్య

మానీలా, ఏప్రిల్ 28: ఫిలిప్పైన్స్‌లోని కమ్యూనిస్టు గెరిల్లాలు నేడు ప్రభుత్వ సైనిక బందోబస్తు పకంపై దాడిచేసి ఆవిశం సహాయంతో ప్రయాణం చేస్తున్న అరోరా క్వెజాన్‌నూ, (మాజీ అధ్యక్షుడు డా॥ క్వెజాన్ సతి) ఆమె కుమార్తెనూ, అల్లుడినీ, మరి 5 గురినీ హత్యచేశారు. ఇదివరకు ఫిలిప్పైన్స్‌కు అధ్యక్షుడుగా పనిచేసిన డా॥ మాన్యుయల్ క్వెజాన్ కుటుంబాన్ని ఈ విధంగా ఓరు హత్యచేసినందుకు దేశమంతా కంపించిపోయినది.

క్వెజాన్ సతి (ప్రెసిడెంట్ క్వెజాన్) జన్మస్థలమైన బలేర్ అనే పట్టణంలో కీర్తిశేషుడైన తన భర్త విగ్రహాన్ని ఆవిష్కరించటానికి, గెరిల్లాల చర్యలు ఉధృతంగా ఉన్న న్యూవెచి ఆనే రాష్ట్రంలో నుండి పలవలసివచ్చినది. ఆమె వెంగలిన వారితో కలిసి సైనిక బందోబస్తు సహాయంతో పోతుండగా ఈ పని జరిగినది.

# దక్షిణ ఆఫ్రికా కామన్వెల్తును విడిచిపెట్టదని మలాన్ ప్రకటన

## ఆఫ్రికా ప్రణాళిక నొకదానిని తయారుచేయడం గురించి ఆలోచించాలని సూచన

లండన్, ఏప్రిల్ 28: కామన్వెల్తు నుంచి వైదొలగిపోవాలనే ఉద్దేశ్యం దక్షిణాఫ్రికాకు లేదని, దక్షిణాఫ్రికా ప్రధాని డా॥ మలాన్, నేడు, లండన్‌లో ప్రసంగిస్తు ప్రకటించాడు. డా॥ మలాన్ ప్రసంగము రికార్డుచేయబడి రేడియోద్వారా ప్రసారం చేయబడినది. ఇతరులతో సంబంధం పెట్టుకోకుండా ఏకాకిగా ఉండవలెననేపంథా దక్షిణాఫ్రికాకు నచ్చదని, శాంతిరక్షణకై ఉద్దేశింపబడిన ఒకేఒక అంతర్జాతీయసంస్థ ఐక్యరాజ్యసమితియెడ, దక్షిణాఫ్రికాకు విశ్వాసమున్నదని మలాన్ తనప్రసంగములో తెలియజేశాడు.

లండన్‌లో కామన్వెల్తు ప్రధానుల సమావేశములో, పాల్గొనుచున్న మలాన్, సమావేశము ముగిసిన తరువాత యిప్పుడు యూరప్ పర్యటనకు బయలుదేరెను. డా॥ మలాన్ యీవేళ లండన్‌నుంచివిమానంలో హాలెండ్‌కు వెళ్లాడు.

"మిత్రరాజ్యాల కూటమితో సహకరించి పనిచేయవలెనని దక్షిణాఫ్రికా అభిలాషఅయినా యీమిత్రరాజ్యకూటమికిలో పలయంలో మరికొన్ని రాజ్యములున్నవి, వీటిలో దక్షిణాఫ్రికా ప్రత్యేకమైన సంబంధబాంధవ్యమున్నది. ఇదే కామన్వెల్తు కౌజ్యములు. మిత్రరాజ్యకూటమికి లోబడి, కామన్వెల్తుతో తన సంబంధబాంధవ్యాలను పరిరక్షించుకోవలెనని దక్షిణాఫ్రికా కుతూహలము.

"ఈకామన్వెల్తు రాజ్యములు, ఒకదానితో ఒకటి స్వేచ్ఛాపూర్వకముగా సహకరించి పనిచేయు సర్వస్వతంత్ర రాజ్యములు. తనహక్కులకు యేమాత్రమూ భంగము కలుగనంతకాలము—ఎప్పుడైనా రిపబ్లిక్ మారేహక్కుకుగూడా అభ్యంతరం లేనంతకాలమూ, కామన్వెల్తునుండి వైదొలగిపోవలెననే ఉద్దేశ్యం దక్షిణాఫ్రికాకు లేదు. ఈ ప్రాతిపదికమీదనే కామన్వెల్తు రాజ్యాలతో మా సంబంధబాంధవ్యాలను కలిగిఉండాలని మా అభిలాష.

యావన్మందీ గాఢంగా ఆకాంక్షించుచున్న ప్రపంచశాంతికి కామన్వెల్తులో వలె సుస్థిరమైన పునాదులు వేయగలగడం ప్రపంచమునకింతవరకూ సాధ్యపడలేదు.

భవిష్యత్తుగూడా అనిశ్చితంగా ఉన్నదిగాని యేమాత్రమూ ఆశావంతముగాలేదు.

"శాశ్వతమైన శాంతికి సుస్థిరమైన పునాదులువేయుట వినా దక్షిణాఫ్రికా వేరొకటి కోరుటలేదు.

దీనినిబట్టి, దక్షిణాఫ్రికా యితరులతో 'సంబంధములేని ఏకాకివిధానమును సమర్థించుటలేదని స్పష్టమవగలదు. శాంతికి పునాదులువేయుటే పనిగాగల, ఐక్యరాజ్యసమితికి ఎన్నోలోపములు, ఎంతో దౌర్బల్యము ఉన్నదని, సర్వదా ప్రచారములకు తప్పుడుపంథాలో సాధనగా వినియోగించబడుచున్నదని, మాకుతెలుసు. ఇది ఎంత ఘోరంగా పతనమైనదంటే తిరిగి సంస్కరింపబడకపోతే నానారాజ్య సమితికంటె గూడఎక్కువగా అప్రతిష్ఠపాలైపోతుంది.

ఏమైనప్పటికీ శాంతిరక్షణకు ఉద్దేశింపబడినఏకైక అంతర్జాతీయసంస్థ ఐక్యరాజ్యసమితి. కాబట్టి ఐక్యరాజ్యసమితిని సంస్కరించినట్లైతే, అది ప్రపంచంలో శాంతీసహకారములను, ప్రయోజనకరంగా పరిరక్షించగల ఉత్తమసాధన కాగలదని దక్షిణాఫ్రికా విశ్వసిస్తున్నది." అని మలాన్ అన్నారు. సువిశాలమైన ఆఫ్రికా ఖండంలో సహజసంపదగలిగిన పరాధీన ప్రాంతములు, పాశ్చాత్యుల ఉపయోగార్థం సుస్థిరము చేయబడవలెనని, ఆఫ్రికా ప్రణాళికఅంటూ ఒకదానిని తయారుచేయాల్సినవిషయం తీవ్రంగా ఆలోచించాల్సిన అవసరంవచ్చినదని మలాన్ విజ్ఞప్తిచేశాను.

# రాజకీయబాధితుల భూములు

## సహకారపద్ధతిపై సాగు ఏర్పాటు

ఏలూరు, ఏప్రిల్ 28: పశ్చిమ గోదావరిజిల్లా రాజకీయబాధితుల సహాయసంఘమువారు భీమవరం తాలూకా అనాకోడేరు గ్రామంలో 350 ఎకరముల పల్లపు భూమిని, 70 మంది రాజకీయబాధితులకు మంజూరు చేశారు. ఈ భూమిని, సహకారపద్ధతిమీద సాగుచేసే విషయం ఆలోచించుట కా భూములీయబడిన రాజకీయ బాధితుల సమావేశ మొకటి నేడు ప. గో. జిల్లా కోఆపరేటివ్ డెప్యూటీ రిజిస్ట్రార్ ఆర్. గజపతిరావు నాయుడుగారి అధ్యక్షతను జరిగింది. సమావేశానికి 38 మంది రాజకీయబాధితులు హాజరయ్యారు. ఈ 350 ఎకరములున్నూ, దీనితోపాటు దానికి నీరు సప్లయి చేసే పంపులు వగైరాకలిగిన కె. సన్యాసిగారి 70 ఎకరములున్ను కలిపి సహకారపద్ధతులపై సాగు చేయుటకు అనాకోడేరు టెనెంట్సు సహకార సంఘమును, పౌరసంఘము నొకదానిని, రజిస్టరుచేయుటకు నిర్ణయించిరి. ఈ సంఘమునకు, భూము లివ్వబడిన 70మంది రాజకీయబాధితులు తమ భూములను 5 సంవత్సరములవరకుగాని, లేక సెంట్రలుబ్యాంకు వద్ద వ్యవసాయం నిమిత్తం చేయబోయే ఋణము తీరిపోయేవరకుగాని, తమ భూములను దఖలుచేయుటకున్నూ, సహకార సంఘముతో సన్యాసిగారుకూడా సభ్యులుగా యుండుటకున్నూ, సహకారసంఘము ఈ భూములను తనఖా ఉంచి సెంట్రలు కోఆపరేటివు బ్యాంకువద్దనుండి అప్పు తెచ్చుట కధికార మిచ్చుటకున్ను నిర్ణయించారు.

ఈ సహకారసంఘ నిర్వహణమునకు ఒక సీనియర్ కోఆపరేటివు ఇన్స్పెక్టరున్నూ, ఒక వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరును 5 సంవత్సరముల వరకూ ఉచితముగా నియోగించవలసినదని, అనాకోడేరు చానల్ ను త్రవ్వించి నటీవసరు కల్పించవలసినదని, భూమి సాగులోనికి తెచ్చుటకు ఎకరమునకు రు 100/- లు సబ్సిడీ లాండు కాలనైజేషన్ సంఘముల కిచ్చు రీతిని ప్రతి సభ్యునికి ఎడ్లను కొనే నిమిత్తం రు. 125/- లు సబ్సిడీమంజూరు చేయవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుటకు తీర్మానింపబడింది. 5 సంవత్సరముల అనంతరము గాని అంతకు ముందే సెంట్రలు బ్యాంకు రు 50 తేలిపోతే ఆ జనువెంటనే గాని, సంఘ సభ్యులందరూ, సమావేశమై సంఘాన్ని కొన సాగించుటయో, లేక రద్దుచేసి, ఎవరి భూమి వారు తీసికొనుటయో నిర్ణయించుట కేర్పాటు చేయడమైనది. ఈ సంఘ నిర్వహణకు సభ్యులలోనుండి 7గురు డైరెక్టర్లను డిప్యూటీ రిజిస్ట్రారు గారు; జిల్లా కాంగ్రెసు అధ్యక్షుని సంప్రదింపుతో నియమించుటకూ, వారు 2 సంవత్సరములు అధికారములో యుండుటకు, తరువాత డైరెక్టర్లను ఎన్నుకొనుటకు నిర్ణయించ బడింది. (స్వ. వి.)

# జె. జె. సింగ్

న్యూయార్కు, ఏప్రిల్ 27: అమెరికాయందలి ఇండియా లీగ్ వార్షిక సమావేశములో శ్రీ జె. జె. సింగ్ ఎన్నుకొనబడెను. 8 సంవత్సరములనుంచి ఈయన అధ్యక్షులుగా నున్నారు. మిస్ పెరల్ బక్ డా॥ లిన్ యుటాంగ్ గారలు గౌరవాధ్యక్షులుగా ఎన్నుకొన బడిరి.

# అ. భా. భావసార క్షత్రియ మహాసభ

ఏలూరు, ఏప్రిల్ 20: అఖిల భారత భావసార క్షత్రియ మహాసభ 13-వ సమావేశం, బొంబాయిలో మేనెల 14, 15, 16 తేదీలందు రామచంద్రరావు, లింగోజిరావు అధ్యక్షతను జరుగును. స్వామి వెంకటారణ్యమహంత్ గారు ప్రారంభోపన్యాసం చేసెదరు. ఈ మహాసభతోపాటుగా అ. భా. భా. క్షు. సమాజ సేవాసంఘం. 2-వ సమావేశము, అ. భా. భా. క్షు. మహిళామహాసభ. 4-వ సమావేశముకూడా జరుగును. కాబట్టి భావసార క్షత్రియ సంఘములు, తాము ఎంతమంది ప్రతినిధులను పంపేది మే 5వ తేదీలోపుగ, పంపుచున్నదియూ, తమకు తెలియచేయవలెనని, భావసార క్షత్రియ యువజన మండలి కార్యదర్శి స్వర్ణ చినవెంకోజీరావుగారు వ్రాసిరి.

# రేడియో ప్రోగ్రాములు

## సంగీతాది కాలక్షేపాలూ, ప్రసంగాలూ మొదలైనవి

మే 1 వ తేదీ ఆదివారం

మద్రాస్ (1 ఎ.): ఉదయం 7-30 ఫిలింపాటలు. మధ్యాహ్నం 1-0 విజయలక్ష్మి నటరాజన్ సంగీతం 3-0 ఎస్. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ గాత్రం. సాయంకాలం 5-30 కె. అరుణాచలం పాటలు 6-15 సుకన్యాస్వామినాథన్ పాటలు 6-45 ఎం. కన్నభిరాన్ పాటలు. రాత్రి 8-0 టి. వి. రత్నం పాటలు.

మద్రాస్ (బి): ఉదయం 7-15 అనంతలక్ష్మి శకగోపన్ పాటల రికార్డులు 8-15 టాకీ పాటలు. 9-0 వివిధ రకాల వాద్యాలు. మధ్యాహ్నం 2-15 ఆట విడుపు. పిల్లల కార్యక్రమం. సాయంకాలం 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7-45 'ప్రపంచ సాహిత్యలక్ష్యం' గురించి ప్రసంగం. రాత్రి 8-30 వరాహూర్ ఎస్. ముత్తుస్వామి అయ్యర్ వైలన్. 9-40 కె. వి. సుబ్రహ్మణ్యం పాటలు.

విజయవాడ: ఉదయం 7-15 నిలయ విద్వాంసుల వాద్యగోష్ఠి. 7-30 వినువీధి. 8-15 శ్రోతలుకోరిన రికార్డులు. సాయంకాలం 5-30 వి. అంకయ్య పాటలు. 6-20 గీతా మంజరి. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7-30 అంకయ్య పాటలు, రాత్రి 8-00 మారెళ్ళ కేశవరావు వైలన్. 9-15 చెంబై వైద్యనాథ భాగవతార్ పాటల రికార్డులు.

# లండన్ సమావేశ తీర్మానంపై కామన్సు సభలో చర్చ

## భారత రిపబ్లిక్‌ను కామన్వెల్తులో ఉంచినందుకు చర్చిల్ హర్షం

## ప్రధానమంత్రుల నిర్ణయాన్ని వివరిస్తూ సభానాయకుడు మారిసన్ ప్రకటన

లండన్, ఏప్రిల్ 28: కామన్వెల్తు రాజ్యకూటమిలో భారత రిపబ్లిక్‌కు, సంపూర్ణ సభ్యత్వంతో స్థానము కల్పించినందుకు, బ్రిటిష్ మాజీ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ నేడు పార్లమెంటులో కామన్వెల్తు ప్రధానులు నిన్న కుదుర్చుకొన్న ఒడంబడికపై మాట్లాడుచూ హర్షము వెలిబుచ్చెను.

భారతదేశం కామన్వెల్తులో ఉండవలెనని, దాదాపు ప్రతి ఒక్కరూ అభిలషించారనడంలో అవంతైనా సందేహం లేదు అని చర్చిల్ అనగా పార్లమెంటులో హర్షధ్వానములు చెలరేగినవి.

"అయితే సమాధానం లేకుండా విడువబడిన ప్రశ్నలనేకం ఉన్నవి. కొన్ని కొత్తఫలితాలు సంభవించవచ్చు. వీటిలో కొన్ని యిప్పుడు మనఊహకు అందని విషమఫలితాలే కావచ్చు. నా మిత్రులందరికీ నేను చెప్పేదేమంటే, వివిధ రాజ్యాల సమ్మేళనతో నూతన రూపంలో ఆవిర్భవించిన యీ ఐక్యతను ఆచరణలో జయప్రదమయేటట్లు చూచుటకు, శక్తివంచన లేకుండా కృషి చేయుట మన యావన్మంది విధ్యుక్త ధర్మము" అని చర్చిల్ అన్నాడు.

చర్చిల్ ప్రసంగానికి పూర్వం డిప్యూటీ ప్రధాని హెర్బర్ట్ మారిసన్, కామన్వెల్తు నాయకులు నిన్న సంయుక్తముగా చేసిన ప్రకటనను పార్లమెంటులో చదువుతూ, భవిష్యద్భారత రిపబ్లిక్‌ను, మిగతా అధినివేశ రాజ్యములతో సమాన హోదాలో సమగ్ర సభ్యత్వంలో కామన్వెల్తులో ఉంచగలిగిన యీ కామన్వెల్తు ఒడంబడిక 'చరిత్రాత్మకమైన ఒడంబడిక' అని ప్రశంసించాడు.

ఈ సంయుక్త ప్రకటనపై పార్లమెంటులో సమగ్రమైన చర్చ, సమ్మతిగా మరొకసారి జరుపుకోవచ్చునని, మారిసన్ సూచించాడు.

"కామన్వెల్తు సమావేశమునకు వచ్చిన వివిధ రాజ్య ప్రతినిధివర్గాలు ప్రస్తుతం తమ తమ ప్రభుత్వాలకు గాని, పార్లమెంటులకు గాని యాపత్తు నివేదించగల స్థితిలో లేరనే విషయాన్ని గుర్తించి చెప్పుచున్నానని అన్నాడు. తరువాత ప్రతికూల పక్షనాయకుడు చర్చిల్ ప్రసంగిస్తూ కామన్వెల్తు నాయకుల సంయుక్త ప్రకటనలాంఛప్రాయంగా పార్లమెంటుకు నివేదింపబడినందుకు సంతోషించుచున్నానని, యింకే మార్గాన్ని అనుసరించిన పార్లమెంటుకు ముఖ్యముగా అన్ని పార్లమెంటులకు మాతృసమమైన తమ పార్లమెంటుకు గౌరవలోపము జరిగెడిదని అన్నాడు.

ఎంతో ప్రధానమైన యీ కామన్వెల్తు ఒడంబడికపై యీనాడే అఖరితీర్పివ్వడం సాధ్యపడదు. మనపార్లమెంటులోనే గాదు, ప్రపంచమున ఐదు ఖండముల లోనూ ఉన్న కామన్వెల్తు రాజ్యాల పార్లమెంటులోగూడా యీఒడంబడికపై చర్చ జరిగితీరవలెను. దీనిని పరిశీలిస్తే ఎన్నో ప్రశ్నలుత్పన్నమౌతాయి. వీటన్నింటికి సమాధానం కన్పించుటలేదు. అంతేగాదు ఎన్నో ఫలితాలుగూడా సంభవించవచ్చు. వీటిలో కొన్ని యీనాడింకా మనఊహకు అందనం విషమఫలితాలు కావచ్చు. ఏమైనప్పటికీ, యీసమయంలో నా అభిప్రాయాన్ని తగినంత అవసరమైనంత సంగ్రహముగా, స్పష్టముగా ప్రకటించక పోతే, కన్సర్వేటివ్ పార్టీ నాయకుడుగా నాకర్తవ్యాన్ని నెరవేర్చలేకపోయిన వాడనౌతాను.

నాదృష్టిలో అతిజటిలమైన ప్రశ్న— మనమందరం యీ ప్రశ్న వేసుకొని సమాధానం సంతుష్టపరచుకోవాలి.—భారత దేశం స్వేచ్ఛగా, ఏకరీతిన్నిర్బంధంలేకుండా కామన్వెల్తులో ఉండాలని మనంకోరుతున్నామా? లేదా? మనలో దాదాపు అంతా 'అవును' అని సమాధానమిస్తారనుటలో నాకిసుమంతైనా సందేహంలేదు. ఈ మాట పెద్దగా గొంతెత్తి చర్చిల్ మాట్లాడేసరికి సభ్యులు హర్షధ్వానాలు చేశారు.

"అనేకసంవత్సరాలుగా నేను వెలిబుచ్చిన అభిప్రాయాలను యిప్పుడు నేను పశ్చాత్తాప పడటంలేదు. గతంలో జరిగిన దానికంతకూ నేను బాధ్యుణ్ణి కాలేదుకదా అని చాలా సంతోషిస్తున్నాను. (ఈమాట చర్చిల్ అనేటప్పటికి ప్రభుత్వపక్షీయులు చర్చిల్‌ను సవాలుచేస్తున్నట్లు పెద్దగా అరిచారు)

ఏదైనా, మనపక్షంలోలేని పరిస్థితుల వల్ల, కాంగ్రెసువారు ఎన్నికైన మెజారిటీ పార్టీ చర్యలవల్ల,మనకు అలాంటిపరిస్థితులు సంభవించినవి."

ఆరునెలలక్రితం తానిచ్చిన ఉపన్యాసంలో ఒకభాగాన్ని యీసందర్భంలో పేర్కొన్నాడు.

"మనము భవిష్యత్తునవలోకించాలి. గతములో మనమంతా యేయేపాత్రలు నిర్వహించినా యేమేపనులు చేసినా, భారత ప్రజలు - యేజాతికి చెందినవారైనా, యేమతానికి, యేసామాజిక వ్యవస్థకు, యేచారిత్రక సాంప్రదాయాలకు చెందినవారైనా-యావన్మంది క్షేమముగా ఉండు సౌఖ్యజీవితాన్ని గడపవలెనని, ఆశిస్తూ భగవంతుని ప్రార్థించుట మన అందరికీ విధ్యుక్తం. భారతీయుల క్షేమాన్ని కోరుతూ వారికిమన చేతనైనంత సహాయము చేయుటమన విధి.

మన హృదయాలలో దుఃఖ భారతీరక పోవచ్చు కాని క్రోధాన్ని విద్వేషాన్ని సమూలంగా తుడిచిపెట్టవలెను. భవిష్యత్తులో భారతదేశంతో మన సంబంధ బాంధవ్యాల విషయంలో ద్వేషానికి, పక్షపాతానికి తావివ్వకూడదు. శాశ్వతంగా గతించిపోయిన మన పూర్వప్రాభవాలను, స్మరణకు తెచ్చుకొని, మనదృష్టిని మందగింపచేసుకోకూడదు."

నేను 6 నెలల క్రితం యీ మాటలు చెప్పినప్పటికీ యిప్పటికీ భారతదేశ వైఖరిలో తేడాకన్పించుచున్నది. బ్రిటన్‌తో సన్నిహితత్వం ఎన్నడూ కలిగివుండాలనే అనుకూల వైఖరినే ప్రస్తుతం భారత దేశం ప్రదర్శిస్తున్నది.

భారతదేశానికి, బ్రిటిష్ సామ్రాజ్యానికి, కామన్వెల్తుకు మధ్య, లేదా భారతదేశంలో ప్రాభవోపేతమైన మన పూర్వ చరిత్రకు,వర్తమానకాలంలో ప్రపంచమున మనం పడుతున్న ఆందోళన మధ్య, తరించవీలులేని అఖాతం సృష్టికానందుకు నేను సంతోషిస్తున్నా. భవిష్యత్తులో, యిది యావన్మందికి సహాయభూతము కాగలదని నా నిశ్చితాభిప్రాయం.

"సరిసమానమైన త్యాగాలు, సరి సమానమైన సహాయాలు, ఉండాలిగాని, ఒక క్లబ్బులో చేరి, క్లబ్బునిబంధనలనను సరించకుండా క్లబ్బువల్ల కలిగే ప్రయోజనాలు పొందడం సరికాదని, యీలాంటి వాదప్రవాదాలు నాకు తెలియక పోలేదు. అయితే పుచ్చుకొనేవాడికన్నా యిచ్చేవాడే ఉత్తమోత్తముడని మన బైబిల్ చెబుతున్నది.

ఇంతకుముందు నేనుఅడిగినజటిలప్రశ్నకు మనమంత మొత్తంమీద 'అవును' అని సమాధానం చెప్పగలిగేస్థితిలో ఉన్నామనుకొంటున్నట్లయితే, ఇకముందు గూడ భారతదేశం మనతో సభ్యతకలిగి ఉండాలని మనం కోరుచున్నట్లయితే భారత దేశం రిపబ్లిక్‌గా కామన్వెల్తులో చేరుటకు రాజరికము అడ్డంకి కాకపోవుట మన అదృష్టము.

కామన్వెల్తు ఐక్యతకు చిహ్నముగాఉన్న రాజసింహాసనము, రిపబ్లిక్ రూపం దాల్చనే భారతదేశమునకు నిషేధమగునని యిదివరలో అప్పుడు జరిగే ప్రయత్నములనుచూచి భయపడ్డాను. కాని అలాంటి ప్రమాదమేమీ లేకుండాచేయుట చాల వివేకవంతమైన పని అని అనుకుంటాను.

కామన్వెల్తులో ఉండుటకు భారతదేశం పెట్టినషరతులవల్ల రాజుగారివ్యక్తిగత గౌరవానికిగాని సింహాసనంయొక్క అధికృతకు గాని భంగం వాటిల్లునని నేను కోరను. పైగా, భారత రిపబ్లిక్ రాజు ఆధికృతను అంగీకరించిన మార్గం బట్టి చూస్తే, రాజరికముయొక్క ప్రాముఖ్యత విలువ, యిదివరకు కంటె యెక్కువైనదని భావిస్తున్నాను.

"ఇదంతా ఆచరణలో ఎలా పని చేయునో మనము చెప్పలేము. ఎన్నో క్లిష్ట సమస్యలను, ప్రమాదాలను అధిగమించవలసి ఉంటుంది. ఏమైనప్పటికీ, నూతనరూపంలో సమగ్రముగా వ్యగ్రమైన యీ ఐక్యతను ఆచరణలో జయప్రదమయేటట్లు చూచుటకు, శక్తివంచన లేకుండా కృషి చేయుట మన విధ్యుక్త ధర్మమనుట నిస్సందేహము. ప్రతికూల పక్షములో నున్న మేము అనుసరింప దలచిన సంధా యిదే.

ప్రపంచములో మనప్రయాణమునకు గాలి వాటముగానున్నది. ఈనాడు మనము ఉమ్మడిగా ఎదుర్కొనే ప్రమాదములు సమష్టిగా నిర్వర్తించే విధ్యుక్తధర్మములు-వీటివత్తిడి ఫలితంగా భారతదేశముతోనే, ఆశయములో విశాల భూభాగంతోటి కొత్తసామరస్యం యేర్పడగలదనినాతలంపు అని చర్చిల్ తన ప్రసంగము ముగించెను.

లిబరల్ పక్షంతరపున క్లెమెంట్ డేవిస్, కామన్వెల్తు ప్రధానుల సంయుక్త ప్రకటనను అభినందించిరి.

చర్చిల్, డేవిస్‌గారను మిత్రభావంతో తమతమ అభిప్రాయములను ప్రకటించినందుకు ప్రభుత్వం తరఫున మారిసన్ ధన్యవాదాలర్పించెను.

లార్డ్సుసభలో వైకౌంట్ హాల్ కామన్వెల్తుప్రధానుల సంయుక్త ప్రకటన చదివాను.

## నూతన పద్ధతిలో విద్యాబోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: పాఠశాలలలో విద్యాబోధకు సాంఘిక విద్యకు దోహదమొసంగుటకుగాను ఇండియా ప్రభుత్వము వారు ఒక కేంద్ర గ్రంథ భాండాగారమును, ఒక శ్రవణ-దర్శన విద్యాబోధ సంస్థను యేర్పరిచిరని కేంద్ర విద్యాశాఖవారు ప్రకటించుచున్నారు. విద్యాబోధన ఫిల్ములను ఉత్పత్తి చేయుటకొకటి ప్రభుత్వము వారి విచారణలో నున్నదని ప్రకటన తెలుపుచున్నది.

ఈ ఫిల్ములను ప్రయివేటు వ్యక్తులు ఉత్పత్తిచేయుటకు అన్ని విధములా సహాయము చేయ ప్రభుత్వమువారు నిశ్చయించిరని, ఈ ఫిల్ముల విలువ పరిశీలించుటకు ప్రవీణుల సంఘమొకటి యేర్పాటుచేయబడు చున్నదని ప్రకటన తెలుపుచున్నది ప్రదర్శనకు పూర్వము ప్రభుత్వము వారిని మాంచి ఆమోదింపదగు.

## నైరోబీ భారతీయ వర్తకుని దాతృత్వం

### ఆఫ్రికన్ విద్యార్థులకు ఉచితవేతనం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 28: భారతవిశ్వవిద్యాలయములలో విద్య నభ్యసింపగోరు వారికై ఆఫ్రికన్ విద్యార్థులకు విద్యార్థి వేతనము లొసంగుటకు నైరోబీ భారతవర్తకుడు మెహన్ భాయ్ షాగారు గానించిరి. ఈ విద్యార్థి వేతన నిధికి ఆయన నెలకు ఒక వేయిరూపాయ లిచ్చుచుండును. ఈయన తంగేడువక్క వర్తకుడు. భారతదేశములో చదువుకొనే ఆఫ్రికనులకు యితర భారత వర్తకులు యింకా విద్యార్థి వేతనము లివ్వవచ్చునని ఆశించుచున్నారు.

# భారత, పాకిస్థాన్ ప్రభుత్వాలకు కాశ్మీర్ కమిషను అంత్యప్రతిపాదనలు

## ఉభయ అధినివేశాలు నిర్బంధంగా అంగీకరించాలని సమితి ఉపసంఘ సూచన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 28: ఐక్యరాజ్య సమితి కాశ్మీర్ కమీషను నేడు ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వములకు నూతన యుద్ధ విరమణ ప్రతిపాదనలను అందజేసినది. తాము ఇప్పుడు సమర్పించిన ప్రతిపాదనలే అంతిమ ప్రతిపాదనలనీ, ఈ ప్రతిపాదనలను గురించి ఇంకా ఎక్కువదూరం చర్చ సాగించడం నిరుపయోగమనీ, ఉభయ ప్రభుత్వములూ ఈ ప్రతిపాదనలను సంకోచము లేకుండా బేషరతుగా స్వీకరించవలెననీ కాశ్మీర్ కమిషన్ విజ్ఞప్తి చేసినది.

కమిషన్ తన ప్రతిపాదనలలో కాశ్మీర్‌నుండి సైన్యములను ఏ కార్యక్రమమును అనుసరించి ఉపసంహరించవలెనో సూచించినది. అంతేగాక, తాత్కాలిక యుద్ధవిరమణ జరిగిన నాటి అనగా జనవరి 15 తేదీ నాటి సైనికశ్రేణుల స్వరూపమును దృష్టిలో ఉంచుకొని ఉభయ పక్షములమధ్య ఒక స్థిరమైన సైనిక సరిహద్దుగీతను నిర్ణయించి తమ ప్రతిపాదనలలో నిరూపించితినని కూడా కమిషన్ ఈ విషయమై చేసిన ఒక ప్రకటనలో నేడు తెలియజేసినది. ఒక వారం రోజులుగా ప్రతిపాదనలకు సమాధానం ఇవ్వవలసిందని కమీషన్ ఉభయ ప్రభుత్వములను కోరింది.

కాశ్మీర్ కమిషన్‌వారు తాము చేసిన ప్రతిపాదనలపై నేడీ ప్రకటన కావించిరి: కాశ్మీర్ కమిషన్ నేడు తమ "అంతిమ" యుద్ధవిరమణ ప్రతిపాదనలను ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వములకు ఏక కాలంలో అందజేసింది. ఒక వారంరోజుల్లోగా తమ ప్రతిపాదనలకు సమాధానం పంపవలసిందని కూడా కమీషన్ ఉభయ ప్రభుత్వములను కోరింది. కమీషన్ చేసిన ప్రతిపాదనలు 1948 ఆగస్టు 13వ తేదీ తీర్మానంలోని ఒక భాగాన్ని ఆధారంగా చేసుకొని రచించబడినవి.

1949 జనవరి 15వ తేదీనాటికి ఉభయ పక్ష సైన్యముల ఆక్రమణ క్రిందనున్న భూభాగపు అంచులను దృష్టిలో ఉంచుకొని ఇరువైపులకు నడిమిగా ఒక స్థిరమైన సైనిక సరిహద్దుగీతను నిర్ణయించుట మైనది. కాశ్మీరునుండి సైన్యములను ఉపసంహరించుటకు ఒక కార్యక్రమం కూడా ఈ ప్రతిపాదనలలో సూచించబడినది. కమీషన్ అధ్యక్షుడు ఆల్‌ఫ్రెడ్ లోజానో మిలిటరీ సలహాదారైన లెఫ్టినెంట్ జనరల్ మారిస్ డెల్వోయ్‌ని వెంటబెట్టుకొని ఇవాళ ప్రొద్దున రావల్పిండినుండి ఢిల్లీకి వచ్చెను. అక్కడ తాత్కాలిక విదేశాంగ మంత్రిగా వ్యవహరించుచున్న గోపాలస్వామి అయ్యంగారిని కలుసుకొని లోజానో కమీషన్ ప్రతిపాదనలను ఆయనకు అందజేసెను. కమీషన్ ఉపాధ్యక్షుడైన రాబర్ట్ మెకాలే రావల్పిండిలో పాకిస్థాన్‌మంత్రి ముష్తాక్ అహ్మద్ గుర్మానీకి ప్రతిపాదనలను అందజేసెను.

కమీషన్ నేడు చేసిన సంధి ప్రతిపాదనలు రావల్పిండిలో గడచిన 8 రోజులుగా జరిగిన సమావేశ పరంపరలో స్థిరీకరించబడినవి. ఏప్రిల్ 15వ తేదీన చేసిన తొలి ప్రతిపాదనలకు ఉభయ ప్రభుత్వముల వద్దనుండి వచ్చిన సమాధానములనూ, సైనిక సలహాదారు డెల్వోయ్, మిలిటరీ పరిశీలకులూ కమీషన్‌కు చెందిన ఇతర నిపుణులు అందజేసిన నివేదికలను, దగ్గిర పెట్టుకొని జాగ్రత్తగా పరిశీలించి ఈ ప్రతిపాదనలను కమీషన్ తయారు చేసింది. నూతన ప్రతిపాదనలతో జతచేసి ఉభయ ప్రభుత్వములకు ఒక లేఖకూడా పంపడమైనది. 1948 ఆగస్టు 13వ తేదీ తీర్మానపు సారాంశానికి భంగం కలుగకుండా ఉభయ ప్రభుత్వముల అభిప్రాయములను వీలైనంతవరకు సమన్వయపరచవలెనన్న ఉద్దేశ్యంతో ఈప్రతిపాదనలు చేయబడినవని ఆలేఖలో కమీషన్ స్పష్టపరచింది. ఇక ఆట్టే తాత్సారం లేకుండా ఉభయ ప్రభుత్వములూ సంధిషరతులను అమలు జరపడం అవసరం అనికూడా నొక్కి చెప్పడంజరిగినది. జమ్ము కాశ్మీర్ సంస్థానమునుండి సాయుధసైన్యములను జరూరుగా ఉపసంహరించవలసిన అవశ్యకతను గూర్చికూడా వారికి హెచ్చరించడమైనది. స్థితిగతులుగూర్చి ఇంకా ఎక్కువ దూరం తరలి చర్చ సాగించడం నిరుపయోగం. కాబట్టి ఇందులో పొందుపరచిన షరతులను ఉభయప్రభుత్వములు నిస్సంకోచంగా నిర్బంధంగా స్వీకరించగలవని కమీషన్ ఆశించుచున్నది." భారత ప్రభుత్వం కమీషన్ సమర్పించిన నూతన ప్రతిపాదనలను శ్రద్ధగా పరిశీలించుచున్నది. ప్రభుత్వం ఈ ప్రతిపాదనలను ప్రస్తుతం దేశాంతరంలోఉన్న పండిట్ నెహ్రూకు కూడా తెలిపి ఆయన అభిప్రాయాన్ని పూర్తిగా తెలుసుకొన్న తర్వాతనే కమీషన్‌కు ప్రత్యుత్తరం పంపుతుందని ఊహించడం అవుతున్నది.

# కొత్త దండయాత్రకు చైనా కమ్యూనిస్టు సేనల సన్నాహాలు

## షాంగైనుండి దక్షిణరేవు పట్టణం అయ్‌కి జనరలిస్సిమో చాంగ్‌కైషేక్ ప్రయాణం

షాంఘై,ఏప్రిల్ 28: షాంఘై నగరానికి చుట్టూ విశాల భూభాగంలో సమావృతమైయున్న కమ్యూనిస్టుసేనలు, నేడు దక్షిణాభిముఖంగా హాంగ్చౌనగరం వైపు తమతమ అగ్రగామిదళాలనుపంపించినవి హాంగ్చౌనగరం చైనాప్రభుత్వసేనల రక్షణశ్రేణిలో కీలకస్థావరము. కమ్యూనిస్టుసేనలు,చైనావాణిజ్యానికంతకూ ప్రధాన కేంద్రమైన షాంఘైపై తక్షణమే దాడి ప్రారంభించునా లేక తాత్కాలికముగా షాంఘైను ప్రక్కగా దాటవేసుకొని, గట్టి రక్షణలేకుండాఉన్న లక్ష్యములపై కురుకునా? యిప్పుడప్పుడే చెప్పుటకు వీలుపడుట లేదని, సైనికపరిశీలకులు అభిప్రాయపడుతున్నారు:

కమ్యూనిస్టు ప్రధానసైన్యములు షాంఘైకు 60 మైళ్ళదూరములోనే ఉన్నప్పటికి,క్రితంవారం అతిసునాయాసంగా నాంకింగ్‌ను వశపర్చుకొన్న తరువాత, ఇప్పుడు అంతతేలికగా షాంఘైపై దాడికిప్రారంభించాను కుండావున్నది.

కొత్తదండయాత్రకు తమసేనలను పునస్సమీకరించుకొనుచూ, కమ్యూనిస్టులు యాంగ్సీనది ఆవలిగట్టునుంచి శతఘ్నులను భారీయుద్ధ సామాగ్రిని చేరవేసుకొనుచున్నట్లు తెలియుచున్నది.

షాంఘైపై దాడి సన్నిహితమవగానే, నగరములోని తమవారిని చేరవేసేందుకు హాంకాంగ్‌లో రాయల్ విమానములు, బి. ఓ. ఎ. సి. విమానములు సర్వసిద్ధముగానున్నది.

హాంగ్సీలో ప్రభుత్వసేనలు యెట్టి వంటి అవాంతరమునైనా ఎదుర్కొనుటకు తయారవుతున్నట్లు వార్తలువస్తున్నది. షాంఘై కోస్తాకుదిగువగా 100 మైళ్ళలో ఉన్న యీ నగరంపైకి కమ్యూనిస్టు అగ్రగామిదళాలు రెండుపాయలుగా చీలి పురోగమిస్తున్నది. ఇందు తూర్పుదిశగా పురోగమిస్తున్నదళము, షాంఘైకు, నైరృతిదిశగా 60 మైళ్ళలోనున్న ప్రధాన రైలుకోడ్డు కూడలికాషింగ్‌వైపు మరలవచ్చు. ఇదే భూమార్గాన ఆక్రమింపు.

నిన్న కమ్యూనిస్టుసేనలు ఆక్రమించుకొన్న సూచౌసమీపాన పసమరగా 4 వేల కమ్యూనిస్టుసేన, షాంఘైకు 10 మైళ్ళ దూరములోకే వచ్చినవట. షాంఘైలో నున్న ప్రభుత్వసైన్యదళముకూడా విరిగా నగరశివార్లలో రక్షణలను నిర్మించుకొంటున్నవి.

నగరమునకు పడమరగా ఉన్న శివార్లలోనూ, వాంగ్‌పూ నదీముఖ ప్రాంతములోనూ, రక్షణ కార్యకలాపాలు సాగుతున్నట్లు స్థానిక వార్తలను బట్టి తెలుస్తున్నది.

మూడు నెలల అజ్ఞాతవాసమును ఒక్క క్రుటిలో ముగించి బయల్పడిన జనరలిస్సిమో చాంగ్‌కైషేక్, రాజకీయ వ్యవహార సమితికి ఆధిపత్యం వహించి, కమ్యూనిస్టుల దండయాత్ర ప్రతిఘటన సాగించుచుండునని, షాంఘై ఈవినింగ్ పోస్టు ప్రకటించింది. చైనా తాత్కాలిక అధ్యక్షుడు లీసుంగ్‌జెన్ డిప్యూటీ వైర్మన్‌గా ఉంటాడని గూడా యీ పత్రిక ప్రకటించింది,

జనరలిస్సిమో చాంగ్‌కైషేక్ యివ్వాళ షాంఘైనుంచి, సైనానౌకలో, ఫార్మోజా దీవికి ఎదురుగా ఉన్న దక్షిణ చైనా రేవు పట్టణం అయ్‌కివెళ్లినట్లు తెలుస్తున్నది.

చాంగ్‌కైషేక్ నిన్న అంతా షాంఘైలోని స్థానిక రాజకీయ నాయకులతోటి, సేనాధిపతులతోటి చర్చలు జరిపాడు.

## 'చెన్నపట్నం ఉమ్మడి రాజధాని కావాలి'

### పౌరసభ తీర్మానం

చెన్నపట్నం, ఏప్రిల్ 29: చెన్నపట్నంలో బహుభాషలవారు ఉండుటవల్ల పొన్నేరి, సత్యవేడు తిరువళ్లూరు తాలూకాలను, చెంగల్పట్టులోని ద్విభాషా తాలూకాలను చేర్చి దానిని ప్రత్యేక రాష్ట్రముగా చేసి కేంద్రప్రభుత్వ పరిపాలనక్రింద నుంచుకొనవలెననియు, అలా చేసినట్లయితే యుద్ధప్రమాద మెప్పుడైన సంభవించితే రేవుపట్నముకు సైనికస్థావరముగా బాగా బలపరచుటకు కేంద్రప్రభుత్వానికి వీలుంటుందనియు, చెన్నపట్నమును ప్రత్యేక రాష్ట్రముగా చేసినను ఆంధ్ర తమిళ రాష్ట్రములకు అది ముఖ్యపట్నంగాకూడా నుండునట్లు ఏర్పాటు చేయవలెననియు, కోరుతూ నిన్న సాయంత్రం కన్యకా పరమేశ్వరి సత్రములో శ్రీ జగం సుబ్రహ్మణ్యం నాయుడు గారి అధ్యక్షతను జరిగిన బహిరంగ సభయందు తీర్మానము గావింపబడెను.

శ్రీ బులుసు సాంబమూర్తి గారు చెన్నపట్నం చారిత్రకముగా ఆంధ్రులదేయనియు దానిపునాదులు,వేసినవారు వ్యాపారాభి వృద్ధికి కారకులైనవారు ఆంధ్రులేయనియు రాను రాను తమిళులు కూడా నగరానికి విశేషముగా వచ్చి స్థిరవాసులై నగరాభివృద్ధికి తోడ్పడిన వారై యున్నారనియు ప్రస్తుతము నగరమునందు బహుభాషలవారు ఉన్నందున ఎవరికీ ప్రత్యేకముగా నుండకుండా ఉమ్మడిగా నుండుటయే న్యాయము ప్రజాకళ్యాణమునకు ననిరి.

డా॥ కే. వి. స్వామి, డా॥ అప్పారావు, మల్లిభార్గవరావు, రంగమన్నార్ వేమారెడ్డి మున్నగువారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్య విషయమై త్రిమూర్తుల కమిటీ చేసిన సిఫార్సులు ఆంధ్రులకు అనంగీకారమని చెన్నపట్నంమీద ఆంధ్రుల హక్కును వదులుకొనలేరని, చెన్నపట్నమును ఉమ్మడి పట్నముగాగాని ప్రత్యేకరాష్ట్రముగా గాని తప్పక చేయవలెనని కోరిరి.

## కన్నడ రాష్ట్రం

### రాజెన్‌బాబుతో నాయకుల చర్చ

హుబ్లీ, ఏప్రిల్ 28: కర్ణాటకరాష్ట్రీయ కాంగ్రెస్ సంఘాధ్యక్షులగు శ్రీ నిజలింగప్పగారి నాయకత్వమున ఒక రాయబార వర్గమువారు నేడు రాజ్యాంగపరిషదధ్యక్షులగు డా॥ రాజేంద్రప్రసాద్ గారినిదర్శించి భాషారాష్ట్రముల నిర్మాణము విషయమై పట్టాభి, నెహ్రూ, పటేలు సంఘ నివేదికయెడల కన్నడ అగు గాఢమైన అసంతృప్తిని వెల్లడించిరి. కాంగ్రెసేతర వర్గములవారు పరిస్థితులను స్వలాభమునకై ఉపయోగించుకొను అవకాశముండుటచేత నివేదిక తమ కార్యకలాపములకు అడ్డుతగులునని రాయబారవర్గమువారు చెప్పిరి.

డా॥ రాజేంద్రప్రసాద్ గారు రాయబారవర్గమువారు చెప్పినదానిని సానుభూతితో వినిరి. మైసూరు, కర్ణాటకము ఒక్క పరిపాలన క్రిందికి రాగలుగునాయని డా॥ రాజేంద్రప్రసాద్ ప్రశ్నించెనని తెలియుచున్నది.

మైసూరులో కొద్దిమంది వ్యాపకులు పరిస్థితులు యిప్పటివలెనే యుండవలెనని వాంఛించుచుండిరని రెండూ ఒక పరిపాలనక్రింద ఏకమగుట క్షేమమని కాంగ్రెస్ అధిష్ఠానవర్గమువారు తెలిపిన యెడల మైసూరు నాయకులకు సమ్మేళనకు సుముఖులుగా చేయవచ్చునని రాయబార వర్గమువారు సమాధానమిచ్చినట్లు తెలియుచున్నది.

భాషారాష్ట్రమును కర్ణాటకులు యెంతగా వాంఛించుచున్నారో తనకు బాగా తెలియునని డా॥ రాజేంద్రప్రసాద్ గారు చెప్పినట్లు తెలియుచున్నది.

## అనపర్తి ఐ. యల్. టి. డి కంపెనీ జాతీయ కార్మిక సంఘం

అనపర్తి ఐ. యల్. టి. డి కంపెనీ కార్మికుల సంఘమునకు ద్వారంపూడి వెంకటరావు, (అధ్యక్షుడు) ముట్నూరి సోమసుందరంగారు (కార్యదర్శి) ద్వారంపూడి రామకృష్ణారెడ్డి, గులుగూరు వెంకటరెడ్డి, తాడపంపూడి, రామకృష్ణారెడ్డి, యస్. సుబ్బారావు, నల్లమిల్లి జనార్దనుడు, నల్లమిల్లి సూరయ్య, కర్రి మంగిరెడ్డి, మల్లిడి వెంకన్న, రొబ్బూరి రామన్న గారలను సభ్యులుగా నియమించడమైనది.

## కాశ్మీర్ కమిషన్‌లో జెకోస్లొవాకియాప్రతినిధి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 27: ఐక్యరాజ్య సమితి కాశ్మీర్‌కమిషన్‌లో జెకోస్లొవాకియా తరఫున జోసెఫ్ గార్బెల్ స్థానే డా॥ హైల్ ప్రతినిధిగా నియమింపబడినాడు. డా॥ హైల్ న్యూఢిల్లీకి రేపు వచ్చును.

## తిరుత్తణిలో లక్షదీపోత్సవం

తిరుత్తణి, ఏప్రిల్ 28: ఇచ్చటి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దేవస్థానంలో మే 4న లక్షదీపోత్సవం జరుగును. ఇట్టి పుణ్యం జరిగి 12 సంవత్సరములు.

## ఇండియన్‌బ్యాంకులిమిటెడ్

ఇండియన్ బ్యాంకు లిమిటెడ్ షేరు హోల్డర్ల సాధారణ సర్వసభ్యసభ ఈనెల 30 తేది సాయంత్రం 4-45 గంటలకు బ్యాంకు భవనములో జరుగును.

## చేతిగడియారాలకు ప్లాస్టిక్ స్ట్రాప్‌లు

చేతి గడియారాలకు ప్లాస్టిక్ స్ట్రాప్‌లు ఉపయోగించుటవల్ల చర్మవ్యాధులు కలుగుతున్నవా అని ఇటీవల మద్రాసు శాసనసభలో ఒకరు ప్రశ్నించారు. ఈ సందర్భంలో, పేరుపొందిన జెట్ బెర్సు ప్లాస్టిక్ వాచ్ స్ట్రాప్‌లను తయారుచేసే కాలిన్స్ అండ్ కంపెనీకి చెందిన, మిస్టర్ జార్జి అట్కిన్స్ ఇలా చెప్పారు:

అనేకమంది తయారుచేస్తున్న ప్లాస్టిక్‌లన్నీ చూడడానికి ఒకేమాదిరిగా కనిపించినా వీటి ఉత్పత్తి విధానాలలో చాలా భేదాలున్నవి. వీటిలో కొన్నిటిలో చర్మానికి హానికరమైన రసాయనాలుచేరి ఉండవచ్చు. ఏమంటే, వాటిని పరిశ్రమల కోసమేగాని ఒకవానివి శరీరంమీద ధరించేందుకుగా ఉపయోగపడవలసివచ్చునని ఉద్దేశించిఉండకపోవచ్చు. కానిచర్మంతో సంయోగం కలిగినా ఎంతమాత్రం చెరుపు చెయ్యకుండా ఉండే రసాయనాలను మాత్రమే ఉపయోగించే విధానాలుకూడా ఉన్నవి. కొద్దిరోజులక్రితం బొంబాయిలో జరిగిన ప్లాస్టిక్ మాన్యుఫాక్చరర్ల కాన్ఫరెన్సులో కొంతమంది నిపుణులు వివరించినట్లు మంచిరకపు ప్లాస్టిక్ స్ట్రాప్‌లు ఇలాంటి విధానాల ననుసరించి తయారు చేయబడినవి గనుక అట్టివాటిని క్షేమంగా ధరించవచ్చును.

## మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 29:

వేరుసెనగ: (581 పా 1-కి ఎర్ర కోస్తాగిడ్డంగులు) మెషీన్(సేల్సుటాక్సుతో సహా) బజారు(కొత్తది) రు. 165-8-0

నంబి 166-8-0

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్(గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 340-0-0

ఆముదం బజారుడెలివరీ ఎక్స్‌పెల్లర్, ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది

| | |
|---|---|
| మొదటి రకం | రు. 345-0-0 |
| రెండవ రకం | రు. 340-0-0 |
| కొంకాయనూనె (87 పౌన్లు గల డబ్బా)ఒకటికి | రు. 82-0-0 |

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 74-10-0 పెట్లా బంగారు తులం 115-4-0 మూస బంగారు 113-8-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 182-8-0 వెండి తులం 1 కి 1-14-0.

పంచదార

| | |
|---|---|
| "కామ్పూరు" (2 అం॥) | రు 92-8-0 |
| అనకాపల్లి" (2 అందను) | స్టాకు లేదు |
| సీతానగరం(2అం॥) | రు. 92-0-0 |
| బూరా (25 పౌ) | రు 9-12-0 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, ఏప్రిల్ 29:

మే 32.93/32.95 జూలై 32.12/32.15 అక్టోబర్ 28.89,28.90 డిశంబరు 28.65/28.68 మార్చి 28.55,28.55 మే 28.34/నా. జూలై 275.5/27.56 అక్టోబర్ 25.72/నా.

| | | |
|---|---|---|
| స్పిన్నింగ్ | హాజరు | 33.50 |
| జూలై | (గరిష్ఠధర) | 11.10 |
| | (కనిష్ఠధర) | 13.48 |

మే వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | జల | 32.24 |
| | నిన్న | 32.25 |
| ,, ముగింపు | జల | 32.12 |
| | నిన్న | 32.40 |

## విజయవాడ

విజయవాడ, ఏప్రిల్ 28:

(ముగింపుధర-సాయం 6 గం॥ లకు)

బులియను-బంగారం-పెట్లా

| | |
|---|---|
| తులం 1 కి | రు 114-8-0 |
| ,, ,, మూసా | రు 113-6-0 |
| ,, ,, సావరిను | రు 75-0-0 |
| వెండి 100 తులాలు | రు 188-0-0 |
| ,, తులం 1 కి | రు 1-14-0 |
| వేరుశనగపప్పు-175 పౌనుల | |
| బస్తా-చేతివాటీ (సంచీకాక) | రు 57-4-0 |
| ,, ,, స్పాట్ రకం | రు 56-4-0 |
| వేరుశనగనూనె-25 పౌనుల | |
| మణుగు తయారు | రు 19-14-0 |
| ,, ,, మే వాయిదా | రు 17-0-0 |
| ,, ,, జూన్ వాయిదా | రు 17-2-0 |
| వేరుశనగ పిట్టు-165 పౌనుల | |
| బస్తా (సంచీకాక)తయారు | రు 13-12-0 |
| ,, ,, మే వాయిదా | రు 14-0-0 |

(నేమంఎండ పేజీని 102)

## "ఆత్మ రక్షణార్థం సయ్యద్‌హబీబ్ రోవెన్ హత్య ఆజ్ఞాపించాడు"

### -ప్రాసిక్యూటరు వాదం

హైదరాబాదు, ఏప్రిలు 28: ఓడ్నీ కాటనుకు గ్రాండు లీంజనీరయిన రోవను హత్యకు కారకుడైన నేరంకింద బ్రిగేడియరు సయ్యదు హబీబు అహమ్మదును విచారణచేస్తున్న కోర్టుమార్షలులో నేడు ప్రాసిక్యూటరు బ్రిగేడియరు ఎస్. ఎన్. భాటియా తనవాదం ఆరంభించి యీ విధంగా చెప్పాడు.

ఈ అభియోగానికి ఆయువుపట్టు, సెప్టెంబరు 14, 1948న రోవన్ తన డయరీలో రాసుకున్న విషయం. ఆరోజు సాయంకాలం 6-45కు ముద్దాయి మెస్ వద్దకు వచ్చాడనీ, కాపలావాళ్ళ హవిల్దారుతో మాట్లాడాడనీ, తరువాత కాపలావాళ్ళ సంఖ్య రెట్టింపు చేయబడిందనీ రోవన్ తన డయరీలో రాసుకున్నాడు. ఈ డయరీ దొరకని పక్షంలో ముద్దాయి తాను ఎట్టి ఉత్తరువులూ ఇవ్వలేదని వాదించి ఉండేవాడే.

రోవెన్ మాయమాటలలో హైదరాబాదుకు తీసుకొని రాబడి అక్రమంగా నిర్బంధంలో ఉంచబడ్డాడు. ఆపని చేసినందుకే మూడేళ్ళ ఖైదు, జరిమానా విధించవచ్చును.

హైదరాబాదులో ఇండియను సేనలు ముందుకు సాగుతున్నవని తెలియగానే, కాపలావాళ్లు పారిపోయిన పక్షంలో రోవెన్ తప్పించుకొని ఇండియను సేనలను చేరుకొంటాడని ముద్దాయి నిశ్చయంగా భయపడ్డాడు. తనను అక్రమ నిర్బంధంలో ఉంచారని రోవను తనపైనా జనరలు ఎల్ ఎడ్రూసుపైనా ఆరోపణ చేసినపక్షంలో తనకు ఇవ్వబడగల శిక్ష తప్పించుకొనేటందుకు గాను ముద్దాయి రోవెనును తుద ముట్టించ నిర్ణయించాడని స్పష్టమౌతున్నది.

అసలు హంతకుల విచారణ జరుగలేదని ముద్దాయితరఫున వాది చెప్పాడు. కాని హత్యే నిర్ణయించినవాడు ముద్దాయి. ఆయన ఆజ్ఞలను అనుసరించి కాపలావాళ్ళ నాయకుడు హత్యకు అనుమతి ఇచ్చాడు. తుపాకితో రోవెనును కాల్చిన రహీమ్ బాదుఖాన్ ఒక పరికరం లాంటి వాడు.

ముద్దాయి పక్షాన సాక్ష్యం ఇచ్చిన హైదరాబాదు సర్వసేనాని మేజరు జనరలు ఎల్ ఎడ్రూసున్నూ, ముద్దాయికి అల్లుడు కానున్న కాప్టెను ఆలీమ్‌ఖానున్నూ కూడా తమకు ముద్దాయిమీద ఉన్న పక్షపాతాన్ని ప్రకటించారు. మాజీ ప్రధాని లాయక్‌ఆలీ చాలా జాగ్రత్తగా సాక్ష్యం ఇచ్చినా, ఎల్ ఎడ్రూస్ సాక్ష్యం ఎంతవరకు నమ్మదగినదో బాగా బయటపెట్టాడు. హవిల్దారు గులామ్ మొహియుద్దీనున్నూ, జమేదారు మీర్జా అబ్దులు కాదరున్నూ చోరీ చేయగోరి కుట్రపన్ని రోవెనును హత్యచేశా రనడానికి ఏమీ ఆధారంలేదు.

కోర్టు రేపటికి వాయిదా పడింది. జడ్జి రేపు కేసును సింహావలోకన చేస్తారు.

## హైద్రాబాద్‌లో ప్రజాప్రభుత్వావశ్యకత

### సంస్థానముస్లింల రాయబారం

హైదరాబాదు, ఏప్రిల్ 28: యూనస్‌సలేం, ముల్లాఅబ్దుల్ బసీర్, సరిక్‌మిర్జా, కమాల్ మొదలైన హైదరాబాదు ముస్లిముప్రతినిధులు ఢిల్లీకి రాయబారంవెళ్ళి, నెహ్రూ, పటేలు మొదలైన కేంద్రమంత్రులను సందర్శించి, అటు తరువాత లక్నో వెళ్ళి జమియత్ ఉల్ ఉలేమా వార్షికసమావేశంలో పాల్గొని 15 రోజుల అనంతరం గురువుంగోవారం ఇక్కడికి చేరుకున్నారు.

హైదరాబాదులోని ప్రస్తుత మిలిటరీ ప్రభుత్వాన్ని త్వరలో రద్దుచేసి ప్రజాప్రభుత్వాన్ని ఏర్పరచమని నెహ్రూకు విన్నపం సమర్పించారట. శరణార్థులకు సహాకారమూ, పునరావాసమూ ఇవ్వమనీ, అకారణంగా ఎరెస్టయిన వారిని విడుదలచేయమనీ, పర్పెండు చేయబడిన ఉద్యోగులను గురించి ఆలోచించమని కూడా కోరారట.

## ఇత్తెహాదు రద్దుచేయు నిర్ణయం

హైదరాబాదు, ఏప్రిల్ 28: ఇత్తెహాదల్ ముస్లిమీన్ సంస్థలో అగ్ర నాయకులు నేడొక ప్రకటనచేస్తూ, హైదరాబాదు ముస్లిములు మతప్రాధాన్యంగల రాజకీయాలు త్యజించాలనీ, మారిన పరిస్థితులలో ఇత్తెహాదువంటి మతసంస్థ నిరుపయోగం గనుక దానిని వెంటనే రద్దుచేయాలనీ అన్నారు.

త్వరలోనే ఇత్తెహాదుల్ ముస్లిమీను కౌన్సిలువారు సమావేశమై యీ నిర్ణయాన్ని ఆమోదిస్తారని తెలుస్తున్నది.

## కామన్వెల్తు నిర్ణయం

### డా॥ పట్టాభిగారి వ్యాఖ్య

మద్రాసు, ఏప్రిల్ 28: కామన్వెల్తు రాజ్యకూటములో సర్వ స్వతంత్రమైన భారతదేశం కూడా చేరియుండుటకు వీలుగా బ్రిటిష్ కామన్వెల్తు రాజ్యం ప్రధానమంత్రుల సభయందు చేయబడిన నిర్ణయమును గూర్చి రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు యునైటెడ్ ప్రెస్ ప్రతినిధితో మాట్లాడుచు ఇట్లనిరి.

ఈ లండను సభానిర్ణయములో క్రొత్త విశేషమేమియున్నూ లేదు. కామన్వెల్తు కూటమునకు బ్రిటిష్‌రాజు చిహ్నమాత్రంగా ఆధిపత్యం వహించవలెనను విషయం ఇదివరలో పత్రికలయందు తర్జన భర్జన చేసిన విషయమే. ఆ సారాంశమే ఇప్పుడీ సభా నిర్ణయరూపంలో వచ్చింది. బ్రిటిషువారు ఈ నిర్ణయం యిదివరకే చాలాకాలం క్రిందట చేసియుంచిరి. కొన్ని యీ కామన్వెల్తు సభల చర్చల ఫలితంగా యిది నిర్ణయమైనట్లుగా దానికొక ఆకారమును కల్పించి ఆ సభ విజయముగా చాటించిరి. ఈ నిర్ణయము జరిగినందుకు భారతదేశం చింతింపబనిలేదు. సంతసింపవలసిన పనిలేదు. సామాన్య భారత పౌరునకు యీ నిర్ణయమువల్ల లాభించేదిన్నీ లేదు. అసామాన్యానికి ఇందువల్ల కలిగే హానికూడా లేదు.

### జాయింటుస్టాకు కంపెనీవంటిది కూడా కాదు

రాష్ట్రపతి డా॥ పట్టాభిగారు అసోసియేటెడ్ ప్రతినిధితో మాట్లాడుచు ఇట్లు చెప్పిరి:—

కామనువెల్తు కూటమునకు బ్రిటిష్‌రాజు ఏవిధంగా నామమాత్రమైన చిహ్నంగా ఆధిపత్యం వహించగలడో నాకు అర్థం అగుటలేదు, దాని భావమేమిటో వివరింపబడేవరకు మనము మానియుండవలెను. ఈ రాజ్యాలకూటం చూడగా ఒక క్లబ్బులో మెంబరుగా చేర డం వలె ఉంది. ఎవరి యిష్టమైనప్పుడు వారు ఆ క్లబ్బులోనుంచి లేచిపోవచ్చును. జాయింటుస్టాకు కంపెనీలోని వాటాదారువంటి సంబంధంగాని కోఆపరేటివు సొసైటీలోని మెంబరువంటి సంబంధంగాని కూడా యీ కామనువెల్తు కూటంలోని రాజ్యాలవారికి లేదు.

ఏ నిర్ణయం చేసినప్పటికీ అది న్యాయశాస్త్రదృష్ట్యా సుదృఢమైనదిగాని, సహేతుకంగా అంగీకారయోగ్యంగాని కాజాలదు. ఏదైనా మధ్యేమార్గపద్ధతిని అనుసరించునట్టి సందర్భంలో ప్రాతిపదికమైన పరశర్మమును కొంత విడనాడుకొనక తప్పదు. మూలశర్మసూత్రమును ఎంతమేరకు విడనాడి వ్యవహరించవచ్చుననే విషయము ఆయా వ్యవహారం నిర్వహించే వ్యక్తినిబట్టి నిర్ణయంకావాలి. కామనువెల్తు కూటానికి రాజుగారు లాంఛనాధిపత్యం వహించుననే విషయం నాకు అర్థమగుటలేదు.

## సాయుధ కమ్యూనిస్టుల ఘోరచర్య

### రంగాగారి ఖండన

ఏలూరు, ఏప్రిల్ 27: గతరాత్రి కమ్యూనిస్టులు దాడిచేసి, కాంగ్రెసుసేవాదళానికి చెందిన కోనేరు బసవయ్యగారి రెండు కండ్లు పెరికివేయుట, కొందరిని హత్యజేయుట, మరికొందరిని గాయపర్చుట, వారి నిర్దాక్షిణ్య ప్రవృత్తికి, పైశాచిక తత్వమునకు అనుగుణముగానే ఉన్నవి" అని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుఅధ్యక్షుడు శ్రీ ఎన్. జి. రంగాగారు పలువోలు దౌర్జన్యాలగురించి ఒకప్రకటన చేశారు.

కాంగ్రెసు సేవాదళము చాలకాలము నుండి, ప్రజలకు కమ్యూనిస్టు దౌష్ట్యము నుండి, ఎంతో ధైర్యంతో రక్షణయిస్తూండడం, వారిదౌర్జన్యాన్ని ఎదుర్కొనేట్లు చేయడం, చేస్తూంది. అందువలన కిరివిాద కమ్యూనిస్టులు చాలాకాలమునుండే పగబట్టి ఉన్నారు. ప్రభుత్వంచే, 'కల్లోల ప్రాంతంగా' ప్రకటించబడినప్పటికే, ఈ తాలూకాలో, ఇట్టిఘాతుకచర్యలు పరిపాటియైపోయినవి. గత మూడుసంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నా మద్రాసు ప్రభుత్వం వారికమ్యూనిస్టు దౌర్జన్యచర్యలను అరికట్టజాలకపోవుట శోచనీయము. శాసనసభలోను, పలుపలుమా ఉన్న, కాంగ్రెసువర్గములన్నింటికి ప్రాతినిధ్యముగల మంత్రివర్గాన్ని, మదరాసుప్రధాని ఏర్పరచకపోవుటవలన, మంత్రివర్గంలోనూ, బయటా, కాంగ్రెసువారిలో విభేదాలు ఈలాగే ఉండినంతకాలమూ, ఒక్కపోలీసువారూ, కాంగ్రెసు సేవాదళమువారూ మాత్రమే ఈ కమ్యూనిస్టు దౌర్జన్యాన్ని అరికట్టలేరని మనవిచేస్తున్నారు. అని రంగాగారి ప్రకటనలోవున్నది.

## ప్రాథమిక సభ్యత్వగడువు హెచ్చింపు

హైదరాబాదు, ఏప్రిల్ 28: వివిధ కాంగ్రెసుకమిటీల కోరికపై హైదరాబాదు కాంగ్రెసు అధ్యక్షుడు ప్రాథమికసభ్యులను చేర్చుకొనేగడువు ఏప్రిలు 30 నుంచి మే 15 కు పొడిగించారు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.